128



శుభమస్తు

# శ్రీ ఆంజనేయశతకము

ఇయ్యది

గోరంట్ల దుర్గారావు తా॥ పాలగానపల్లి

శ్యాం. నారణప్పగారిచే రచియింపబడి

——:o:——

ఆదిపూడి సోమనాథరావు గారిచే

పరిష్కరింపబడి

——:o:——

బి. మునిస్వామినాయుడు గారిచే

ప్రకటింపబడియె


స్వామివిలాసముద్రాక్షరశాల

హిందూపురం.

మొదటికూర్పు 1000 ప్రతులు

1922 సం॥




# విజ్ఞాపన.

—:o:—

మహనీయులారా ఈశతకము ప్రారంభించవలెనని శ్రీగారు చెప్పుచువచ్చినందున నాకు పరిపరి విధంబుల ప్రోత్సాహమును చేసి యిప్పుడు నానుండి నెరవేర్పించునట్లు చేసిన మ॥ రా॥ రా॥ నాగసముద్రము జమీన్‌దారుగు బాబిరెడ్డిగారికిన్ని కడగత్తూరు మ॥ రా॥ రా॥ జమీన్‌దారుగు అంజిన రెడ్డిగారికిన్ని భగవంతుడు చిరాయు రారోగ్య అయిశ్వర్యంబులు నొసంగు నుగాకయని యనిశంబును ప్రార్థింపు చున్నాడను.

ఇట్లు తమ

శ్యా. నారణప్ప.

సీ॥ శ్రీరామదూతనిన్- సీసపద్యములచే।

భజన సేసెదనయ్య- పరమభక్తి

గణయతిప్రాస సం- గతులునేర్వగలేదు

శబ్దలక్షణములు- చదువలేదు

అమరకాండలు నాకు- నమరియుండఁగలేదు।

కావ్యనాటకములఁ- గాంచలేదు।

వ్యాకరణంబును- వల్లింపఁగాలేదు।

శ్రుతులశాస్త్రంబులఁ- జూడలేదు।

గీ. మించుభక్తినినినుఁ-గొల్వ-నెంచినాను।

దప్పులుండినమన్నింపు- తరుచరేంద్ర।

పరమభక్తజనాశ్రయ-పవనతనయ।

హాలగానపురాలయ- ఆంజనేయ.

సీ। అసహాయశూరుఁడై - యంబరంబునకేగి।
బాలార్కబింబంబు - బట్టినావు।
జలరాశిఁ దాఁటను - జెలరేఁగి బలముతోఁ
జలముతో ఛాయను - జంపినావు।
సురలు పంపఁగ వచ్చు - సురసమాయను దాటి।
యలుకతోఁ బోరాడి - గెలిచినావు।
నిను గోరుచున్న యా - గను గొని మది మెచ్చి।
యమితబల తార్కరంబు - వందినావు।
గీ. నిన్నుఁ బొగడంగ శక్యమే - నిర్మలాత్మ।
రామకార్యధురంధర - కామరూప।
పరమభక్తజనాశ్రయ - పవనతనయ।
హాలగానపురాలయ - అంజనేయ. 2

సీ॥ నీబాహుబలిమిచే - నిర్జరుల్ చూడ లం॥
కిణియను దానవి - గెలచినావు॥
నీమహామహిమచే - నీరూపుఁ జూపించి।
దేవికుండినదిగుల్ - దీర్చినావు।
అతిభయంకరుఁడవై - యారామమును నీవు।
ధరణిఁ గ్రక్కదలఁ గాఁ - బెరికినావు।
రమణీయమూర్తివై - రావణుసభలోన॥
పెంపైన వాలంబుఁ - బెంచినావు॥
గీ. నిన్ను సంపూర్ణముగను వర్ణింపఁ జాల।
బుధజనావళిసన్నుత - భూరివిజయ ॥పరమ. 3

సీ॥ అవసానసమయాన- యమునిదూతలువచ్చి॥
యురుబాధలనుబెట్ట- కుంచుమునుపె
పలువిధంబులరోగ- ములుచేరికాయమున్-
మెండుగాసమయింప- కుంచుమునుపె-
బంధుపుత్రదరిజేరి- బలుచింతగన్నుల-
నుండినీరునుజార్ప- కుంచుమునుపె-
కంఠంబులోపల- గఫముగట్టిగగట్టి-
చండవాతముముంచ- కుంచుమునుపె-

గీ॥ నీగుణంబులమదిలోన- నిల్పినిన్ను-
గొలుచుభాగ్యమ్మునిమ్ము- నిర్మలచరిత్ర-ప॥ 4

సీ॥ కేసరివరపుత్ర- భానుకోన్నతగాత్ర-
భక్తవత్సలకోటి- భానుతేజ-
నీతికార్యధురీణ- నిర్జరసన్నుత-
భజనసేసెదనయ్యా- పరమభక్తి-
బ్రహ్మచర్యవ్రత- పరిపాలనాసక్త-
యంజనీనందన- యమితవీర-
పరమపావనకీర్తి- పతితపావనమూర్తి-
బుధజనావళినుత- భూరితేజ-

గీ॥ నిన్ననెన్నంగశక్యమే- నిరుపమాన-
చిత్తగింపుమునామ్రొక్కుడ- జిత్రచరిత- పవమా॥ 5

సీ॥ కోటికిబ్రతికిన - గాటికిబోవుట -
దప్పదటంచులోకోక్తి - తప్పగాదు -
జలబుద్బుదమురీతి - జెలగెడునీదేహ -
మెప్పుడుపోవునో - యెఱుగరాదు -
శతవర్షములదాక - శ్రుతులుపల్కు నుగాని -
సమ్మరాదామాట - నరుడుమదిని -
బాల్యమ్ముననొ లేక - పడుచుదనాననో -
మాసవ్వుండెప్పుడో - మరణమందు -
గీ॥ అవనిలోగాయమస్థిర - మనితలంచి -
నీపదములగొలిచెద - నిండుమదిని - పరమ॥ ౯

సీ॥ కాలంబుమారినఁ - గతినమైయున్నది।
మామూలువిద్యలే - మరవనాయె।
శ్రేష్ఠమౌ - ధర్మములే నష్టములై పోయెఁ
బుడమిలోఁ బుణ్యంబు - పూజ్యమయ్యెఁ
బెండ్లాములంజలు - పెద్దదేవతలైరి।
తల్లికిమర్యాద - తప్పిపోయె।
తండ్రిబిడ్డలకును - దగవులుమెండాయెఁ
బూజ్యులసేవయుఁ - త్యాజ్యమయ్యె।
గీ. అయినఁ గానిమ్మనాకేమి - యార్యవినుత।
నిన్నునేమఱకుందునో - నిర్మలాంగ ॥పరమ॥

సీ॥ కామినులనియెడి- కాంతారభూమిలో।
స్తనములుండెడునట్టి- స్థలమునందు।
మానసంబనియెడి- మార్గస్థుడానీవు।
తెలివితక్కువచేతఁ- దిరుగవలదు।
అక్కడననువుగా- నక్కిచోరుఁ డొకండు।
కన్నులవిల్కాఁడు- కాచియుండు।
పోయినప్పుడెనిన్ను- భువిమీఁదబంధించి।
పెక్కుబాధలుసేతుఁ- బెట్టునంచు।
గీ. తనకుఁదాఁ జెప్పుకొనుచుఁ జిత్తమునసిన్ను।
భజనఁజేసినఁ వాడెపో-పరమగురుఁడు॥పరమ. 8

సీ॥ రాజీవనేత్రల- రంజిల్లుముఖమును।
కూర్మిఁజూడనరుండు- గోరుచుండు।
వీక్షించినంతనే వేగనా- వెలఁదిని।
కూర్పఁగానక్కనఁ- గోరుచుండు।
ఆలింగనముసేయ- నమితమోహంబుచేఁ
గోమలిఁగవయఁగాఁ- గోరుచుండు।
బొందినయంతనే- పొలఁతినిపీడక।
కూడియేయుండఁగఁ- గోరుచుండు।
గీ। ఇట్టితుచ్ఛంపుఁగోర్కెల-నెట్టివైచి।
నిన్నుదలఁచినవాడెపో-నిర్మలుండు। పరమ। 9

సీ॥ ఎవరునిర్మించిరి- యీవారకాంతను-
కాంతకాదిదిమైల- ముంతగాని-
భామయందురుగాని- బాగుగా దలపోయ-
భామగాదిదినాగు- బాముగాని-
కలికిపల్కులచేత- గలిమిసొమ్ముల్లహరించు-
నారికాదిదిగొప్ప- మారికాని।
నిర్వీర్యునిగఁజేసి- నీతిఁబోఁగొట్టును।
నింతిగాదిదిముండ్ల- తంతిగాని॥
గీ॥ రోతకరవగునట్టి యీ- నాతివిడచి।
నిన్నునమ్మినమనుజుండె- నీతిశాలి ।పరమ. 10

సీ॥ పొలఁతులముఖమును- బూర్ణచంద్రుండనఁ
జీమిడిచంద్రుప్రోఁ- జేరియున్న॥
మానినికుచముల- మాలూరఫలమన।
మాలూరఫలమందు- మాంసమున్న॥
తొయ్యలిపెదవిని- దొండపండనగను।
బండుబోపలజొల్లు- పారుచున్న॥
తరుణినేత్రమ్ములఁ- దమ్మిపువ్వులనంగ।
బుసిపూలలోపలఁ- బుట్టుచున్న॥
గీ॥ గానమగువలఁబొగడక-మానసమున।
నిన్నుఁబొగడినవాఁడె పో-నిర్మలుండు॥పరమ. 11

సీ॥ దురితజాలములన్ని - దొంతిగాఁగూడిన|
భువినుండునరకంబు - పొలఁతియూప॥
మనిమాససంబునఁ - గనుఁగొనగా లేక|
యతివలపొత్తును - ననుభవించి॥
యమితపాపంబుల - నార్జించియార్జించి|
భూరిదుఃఖంబులఁ - బొందుచుండ్రు॥
అతిపాపజన్మలౌ - సతినలవిడచిన|
మనుజవరేణ్యుండె - మానవంతుఁ
గీ॥ డనుచునీభక్తవరులెల్ల - నాత్మదలఁచి|
రామలనువిడచియుందురు - కామమెడలి॥పరమ॥ 12

సీ। మరుకోపసంగతి - మానిసమనుజుండుఁ
సద్గతిఁ బొందును - సత్యముగను॥
మరుగుగానుండెడు - మురుగుపాత్రయటంచుఁ
గానుంబుదానిని - గానకుండుఁ
అమితకామంబుచే - నసురనాధుండైనఁ
రావణుండేమాయె - రమణివెచ్చిఁ
మృత్యువుఁ గెలవంగ - సత్యమామంత్రంబు|
కామంబువిడచినఁగానవచ్చు॥
గీ॥ ననుచునీభక్తవరులెల్ల - ననుదినంబు|
చెప్పగావినియుంటిని - చిన్మయాత్మ |పరమ॥ 13

సీ॥ పాపికిదయలేదు- పందికిశుచిలేదు।
నెలఁతలమనసమున- నిజములేదు॥
ఆశకుఁ గొనలేదు- అప్పునకుఁ గడలేదు।
మరణకాలమునకు- మందులేదు॥
యోగికిధరలేదు- రోగికిరుచిలేదు।
వారకాంతకువావి- వరుసలేదు॥
యుక్తికిసరిలేదు- భక్తికిదులలేదు।
నిజముపల్కుటకంటె- నీతిలేదు॥
గీ॥ జగతినీసేవకంటెను భాగ్యంబులేదు।
నన్నుదయఁజూతువనినిన్ను-నమ్మినాను॥పరమ. 16

సీ॥ ద్విజరాజబింబమ్ము- ధిక్కరించెడుమోము-
మించుసీరజముల- మించుఁగనులు-
వరసిలములబారు- వనజాక్షునూగారు-
షట్పదంబులమించు- సఖియకొప్పు।
మకరమ్ములనుబోలు- మానినిజంఘలు-
పెదలిపాలిండ్లు- పసిఁడిగుండ్లు-
తిలపుష్పములబెన్కు- దెగెడుచుండెడుముక్కు-
నిరిగిగాంచిహసించు- నెలతనడుము-
గీ॥ అనుచునతివలవర్ణింప- నగునెముక్తి.
బొగడగానిన్నుగలుగును- భుక్తిముక్తి॥పరమ॥17

సీ॥ నీనామమంత్రంబు- నిరతంబు జపియించు-
పురుషుడే భువిలోన. బుణ్యశాలి
నీపాదసేవను. నిరతంబు గావించు.
నీతిసంపన్నుడే. నిర్మలుండు.
నీమూర్తి గన్నుల. నిరతంబు వీక్షించు.
పూతచారిత్రుడే. మోక్షకామి.
నీనామవిజయంబు. నిత్యంబు బోధించు.
గుణవంతుడే మహి. గురువరుండు.
గీ॥ నిన్ను వర్ణింపనలవియే. నిజ్ఞతారె.
నన్ను నీభక్తునిగ జేయు. విఘ్నవిరతు॥ పవమా॥ 18

సీ॥ మానవజన్మంబు మహిలో సంజాతింగ।
నన్నిటిలోపల-నధికమంత్రు।
ఇట్టిజన్మంబు నీ-యిలలో సనాస్తించి।
కాలము నూరక-గడబకుండ
పరభామినులమీఁదఁ-బరధనమ్ములమీఁద।
నుల్లంబు నాశ జే-నుంచకుండఁ
జయజయ శ్రీరామ-చరణాబ్జషట్పదా।
జయశుభచారిత్ర-జయము నీకు।
గీ॥ సనుచు నీనామమంత్రంబు-సనుదినంబుఁ
జింతనము సేయుచుండు-నాచిత్తమందు॥ ॥ప॥ 19

సీ॥ దీనుడనియును- దిన్కు_నీవని వేడఁ।
జూడకుందువుసన్ను- జోద్యమేమొ॥
దొరతనమిమ్మని- దరిజేరెనినుబట్టి।
పెద్దబాధనునీకుఁ- బెట్టలేదు।
భూమిలిమ్మనిన్ను- భువినీడ్వగాలేదు॥
విత్తమిమ్మనినిన్ను- వేడలేదు॥
వస్త్రమ్ములిమ్మని- వస్తువులిమ్మని।
గాసిపెట్టగలేదు- కపివరేణ్య॥
గీ॥ పావనంబగునీనామ- భజనమొసఁగి।
మెల్లిమితో మోక్షపదవిని-నియ్యుమంటి॥పర॥ 22

సీ॥ నిజమైనభక్తితో- నేనెంతవేడిన।
గరుణచేనీమది- గరుగదేల॥
అతిదీనుఁడై నిన్ను- యాచించుచుండిన।
నన్నశస్త్రములిచ్చి- యరయవేల॥
పెనులోభియగుటచేఁ- బెండిలియాడక।
బ్రహ్మచర్యమునీవు- పట్టినావొ॥
మంచిమాటలచేత- మఱిమఱివేడినా॥
యీమొఱసిచెవి- కెక్క_దేల॥
గీ॥ వ్వనామదినుప్పట్టి- వాంఛదీర్చి।
దయనునన్నేలసికేమి- తక్కు_వగును॥పరమ॥ 23

సీ॥ ఎంతనిన్ బిలిచిన- నింతయుఁ బలుకవు।
పృథ్విలోనిదియొక్క- పెద్దతనము।
ముచ్చటగానీవు- వచ్చిమాట్లాడిన।
ధరలోననీకీర్తి- తక్కువగున।
విచ్చేసననువీఁడు- వి త్తమేమైనను।
వడుగునేమోయని- యడలినావ।
మరుగునడాగిన- మాత్రానవిడుతునా।
బలవంతముగనిన్నుఁ- బట్టియీడ్తు।
గీ॥ జన్మమును బాయుదారిని- జక్కగాను।
జూపవేజాగుచేయక- శుభచరిత్ర॥ పరమ॥ 24

సీ॥ నన్నేలుమనినిన్ను- నర్మిలివేడినఁ।
గారుణ్యమింతేని- గానరాదు।
నిర్మలమైనట్టి- నీభక్తితోనేను।
నుర్విలోనర్తించు- చుండలేద।
గొప్పవారెవరును- గోర్కెలివ్వగనీకు।
బోధించియుండరా- పుణ్యమతిని।
నెరవేర్చనాకోర్కె- నీచేతఁగాకున్న।
జానకీపతికైనఁ- జనువుమీరఁ।
గీ॥ జెప్పితీర్పుము లేకున్నఁ- జెప్పనేల।
విడువనీవెందుఁజనిన- విశ్వమందు॥ పరమ॥ 25

సీ॥ మాయసంసారంబు- మదిని నమ్మక నిన్నుఁ।
బాలింపుమని వేడఁ- బలుక వేమి।
నాయందు దప్పేమి- న్యాయంబు వీక్షించి।
దయతోడ రక్షింప- ధర్మ్యుడగుదు।
పసరాని మాటల- ననియుండిననుగూడ।
మన్నించి నన్నేలు- మంగళాంగ।
తనయుల తప్పులు- తండ్రి యెల్లప్పుడు।
మదిలోన నుంచఁడు- మమత చేత।
గీ॥ ధరను నీకన్న వేఱు నా- తండ్రి యెవఁడు।
గరుణతో నన్ను జూడుము- కపివరేణ్య॥పరమ॥26

సీ॥ భక్తవత్సల నిన్నుఁ- బరిపరి విధముల।
భజియింతు భజియింతుఁ- బరమపురుష।
మారుతాత్మజ నన్ను- మమతతో నెప్పుడు।
మన్నించు మన్నించు- మంగళాంగ।
శ్రీరామదూత సీ- శ్రీపాద సేవనే।
కరుణింపు కరుణింపు- తరుచరేంద్ర।
నాయందు దయయుంచి- నానేరములుగాచి।
నన్నేలు నన్నేలు- నగచరేశ।
గీ॥ నీవె నాపాలి దైవంబు- నిర్గుణాత్మ।
దాసుఁడగు నన్నుఁ గావవే- ధన్యుఁడగుదు॥పర॥ 27

సీ॥ కలికాలమహిమంబు- కఠినమై తోఁచెను॥
మోసమెల్లెడలను- ముంచెభువిని।
నీపక్షమునవచ్చి- నేఁజేరియుండంగఁ।
బరులచేభయమున్నఁ- బలుకనలను।
నాచేతిరొక్కంబు- నన్నూఱులుఖర్చైయిన॥
నిన్ను నేఁబ్రతికింతు- నిజముగాను।
ననిసమ్మకముచెప్పి- యతిసులభంబుగ।
ముద్దుమాటలచేత- మోసగించు।
గీ॥ నట్టిదుర్మార్గులనుజేర- నట్టిమతియు।
నిన్నుమరువనిబుద్ధిని- నిరతమిమ్ము॥ పరమ॥ 28

సీ॥ జగతిలోనుండెను. జనులకునిప్పుడు।
మెప్పుగనడతను. జెప్పలేను।
బలవంతుఁడుగనున్న. బంటువాఁడందురు।
సన్నగానుండిన. జాడ్యపుంగ్రహ।
పెదవికసుమ్ముఁజే. బిచ్చమెత్తుచునున్నఁ।
[illegible] చేయుకండ్లైను. [illegible]।
[illegible] ంబు. ప్రద్యోతజ్ఞించినఁ।
[illegible]।
గీ॥ ధనసుఖంబౌనిన్ను మెప్పింప. వచ్చుఁగాని।
నట్టుల మెప్పింపఁగలవాఁడు. ధరను లేరు॥పరమ॥ 29

సీ॥ లవణాంబుధిని నీవు- లంఘించినటియూ।
ధరలోనిసీభవ్య- తనువుచేత।
రజతాద్రియెత్తియా- రావణుగర్వంబు॥
మాపిననీమహా- మహిమచేత।
సంజీవినిఁదెచ్చి- సౌమిత్రిప్రాణంబు।
గాచిననీదివ్య- కరముచేత।
పాతాళమునకేగి- పాపిమైరావణు।
జంపిననీదివ్య- జయముచేత।
గీ॥ దురితజాలమ్ములన్నియుఁ- బోవుటలు।
ముక్తిమార్గంబుఁజూపుము- మోదమిజుము॥ప॥30

సీ॥ పటుతరసంసార- బంధమునను జిక్కి।
మోహాబ్ధిలోపల- మునిఁగినాను।
నాబంధనముఁద్రుంచి- నన్నుగట్టునజేర్చు।
విఖ్యాతిగన్ననీ- పేరుచెడదు।
నాయందుఁదప్పున్న- నర్మిలిచేనీవు।
మన్నించినన్నేలు- మంగళాంగ।
ధరలోననీకన్న- దాతలేడనినిన్ను।
వినయంబుమీఱంగ- వేడినాను।
గీ॥ ఆర్తజనరక్షబిరుదాంక- యమరవినుత।
దిక్కునీకంటెనెవ్వరు- దీనరక్ష॥ పరమ॥ 31

సీ॥ నీధణిరాముంను- నిర్జరుల్ మొదలుగా।
నెల్లజీవులదయ- నేలువాఁడు।
అట్టినీధణిభార్య- యవనిజయగుసీత।
భార్గవియగుభామ- భవ్యతేజ।
సీతండ్రిశంభుండు- నివసించువట్టిది।
విబుధులుగొనియాడు- వెండికొండ।
నీపరాక్రమశక్తి- నిఖిలలోకములందు।
నమరులునుతియించు- నట్టిదగును।
గీ॥ ఇట్టినీవేలఁగానాకు- నేమికొఱత।
ముక్తిమార్గంబుఁజూపుము- మోదమిందుము॥పర॥ 32

సీ॥ పవమానసనందన- వసుధలోనరుఁజునీ।
పదములభజియింప- భక్తితోను।
యముఁడుదగ్గఱఁజేర-నాత్మలోదిగులొందుఁ
బాపసమూహంబు-పరువులెత్తు।
శాత్రవబృందంబు- శరణనిప్రార్థించు।
నాతనిజయలక్ష్మి- ననుసరించు।
గాలునికింకరుల్- కడగంటఁజూడఁగా।
భయమందిమదిలోనఁ- బారుచుండ్రు।
గీ॥ అట్టిదిట్టిదియనిచెప్ప- నలవిగాని।
నీచరణసేవచేసితి- నెమ్మినెమ్మి। పరమ॥ 3[illegible]

సీ॥ హైనాకగిరినీవు- మహసాశమన్నింపు।
దయగలవాఁడని- తలఁచియుంటిఁ।
గానినీవంటిని- ప్రభుఁడు లేఁడని।
తేటగానిప్పుడు- తెలిసికొంటి।
సంజీవినిఁ దెచ్చి- సౌమిత్రిఁగాచిన।
మాటన్నశక్తిఁ బచ్చి- మరలవిన్న।
నన్నుమన్నించెదీ- నానాథుఁడవుకొంటిఁ।
గరుణలేదనినీకు- గానన్నైతిఁ।
గీ॥ గానినన్నుఁ గావవయ్యంపు- గాఁకరాఁడు।
ఆర్త్తజనరక్షబిరుదాంక- అమరవినుత॥ పరమ॥ 34

సీ॥ సఖియనీముఖముతో- సరిగానునేనని।
చంద్రుండుసిగ్గుతోఁ- జనియెదివికి।
నింతినీకుచములు- యీడుగామేమని।
చక్రవాకంబులు- సరసిఁజేరె।
కలకంఠినీదగు- కటిఁజూచిసింగముల్।
దీటుగామనిశాము- డెరలెగుహల।
కలికినీమధురవా- క్యములకులజ్జించి।
చిలుకలుపరువెత్తి- చెట్లలెక్కె।
గీ॥ ననుచుఁగామంబుచేతను- నతివఁబొగడు।
బుద్ధిహీనుఁడనుముక్తి- బొందఁగలఁడె॥ పరమ॥ 35

సీ॥ నాయిల్లునాభార్య- నాధనంబనినేను।
ననుకొనంగొన్నాళ్లు- లరిగెనాకు।
నాసమానములేదు- నాకులంబెక్కువ।
ననుకొనంగొన్నాళ్లు- లరిగెనాకు।
నేఁబండితుండను- నేఁదెలిసినవాఁడ।
ననుకొనగొన్నాళ్లు- లరిగెనాకు।
నేపరబ్రహ్మంబు- నేచిదానందుండ।
ననుకొనగొన్నాళ్లు- లరిగెనాకు।
గీ॥ కాలమంతయువ్యర్థమై- గడచిపోయె।
నిప్పుడైననునీసేవ- యిమ్మునాకు॥ పరమ॥ 36

సీ॥ కపుశక్తి మంతుండు-కపివరేణ్యుండని।
ష్టితిత్రోసిజనులునీకె-జెప్పుచుంద్రు।
లవణసముద్రంబు-లంఘింపఁగలయట్టి।
నేరుపునీదయై-నెగడుచుండు।
అంజనీపుత్రనీ- యతులప్రతాపముఁ।
భువిదివినందఱు- పొగడుచుంద్రు।
దశకంఠుమదినున్న- దర్పంబునార్పగాఁ।
దగువాఁడునీకంటె- ధరణిలేడు।
గీ॥ ప్రబలుఁడై యిట్లువెలసిన- ప్రభుఁడవయ్యు।
నేలబరువుగఁదోఁచెన- న్నేలనీకు॥ పరమ॥ 37

సీ॥ అడవులం దిరుగుచు- నన్యులకెగ్గును।
దలపకాకలఁ బులఁ- దడవితినెడు।
మేఁకనునటికెయా- మేనిమాంసంబును।
మెక్కువీరలమని- నిక్కువారి।
కనుమీవ పశువని- కరుణయింతయులేక।
యెదలోనొకింతయు- బెదరులేక।
ప్రేలాడగాఁగట్టి- తోలునుఁదగఁదీసి।
సూరులఁబనుకోను- చున్నవారి।
గీ॥ కట్టిశిక్షనొసంగదో- యెఱుఁగఁదరమొ।
యీయుగాఁగాని ప్రాణంబు- దీయనగునె॥ ప॥ 38

సీ॥ కలలోనఁగన్నట్టి- కలిమినిమోహ్కని।
చూచినఁదోఁచునే- చూపుక్కలకును।
జలబుద్బుదమువంటి- దిలలోన దేహంబు।
నిలుచునాతాంక్లను- నియతిగలదా।
యింతమాత్రానకే- యుష్మహిలోమూర్ఖి।
తెక్కుసుమదముచే- నిక్కుచుండ్రు।
భూరివిత్తముగల- భోగవంతులమని।
పాపపుణ్యంబులఁ- బాటిగోనరు।
గీ॥ పరులనెంతయు నవిశంబు- బాధపెట్టి।
సంపత్తులఁగూర్చునుండునే- శాశ్వతముగ॥ ప॥ 39

సీ॥ చంద్రబింబమునాతి- చక్కనినెమోము॥
కమలపత్రంబులు- గన్నులరయ।
అద్దంబులనవచ్చు- నతివచెక్కిళ్లను।
ముంగురుల్ మించును- భృంగములను।
బంగారపుఁగుండ్లు- పద్మాక్షి పాలిండ్లు।
పంచాస్యమధ్యంబు- పడఁతినడుము।
మెలతదేహపుఁగాంతి- మెఱుపునుదలించు॥
మదగజయానంబు- మగువనడక।
గీ॥ అనుభవింప- దుర్గతియబ్బునిజము।
నిన్నుఁబొగడినమోక్షంబు-నిక్కవంబు॥వ॥40

సీ॥ కస్తూరిమూటను- గాడిదపై కెత్తు॥
మేలగువాసన- మెచ్చఁగలదె।
రాగభేదంబుల- రమణీయముగఁబాడ॥
మేలనిశునకంబు- మెచ్చఁగలదె।
పన్నీటఁజక్కఁగాఁ- బందినిముంచిన।
మంచివాసనయని- యెంచఁగలదె।
దయయునుసత్యమ్ము- ధర్మరూపములని।
దుష్టునిమదిలోన- దోఁచఁగలదె।
గీ॥ పాపనాశనమైననీ- పాదమహిమ।
తెలివిమాలిననామది- తెలియఁగలదె॥వర॥41

సీ॥ పసుపుఁగత్తెమొగమ్ము - పాతకమ్ములకిమ్ము॥
జాడ్యాలపుట్టయీ - చానపొట్ట।
కౌరవనరకంబు - వారకాంతరతంబు।
జారిణీయూరు - దోసపుబజారు।
వెలయాలిమాటలు - విసపుఁబెల్లాటలు॥
యమునిచేతియురులురో - యతివకురులు।
కులటలమైయొప్పు - కులకాంతలకుముప్పు॥
భోగినివలపునో - ములకుఁజెఱుపు।
గీ॥ గాననీపణ్యకాంతల - మానివేసి।
నిన్నుఁదలచినవాఁడెపో - నీతిశాలి॥పరమ॥ 42

సీ॥ బలురంకులాడికిఁ - బతితోడనిష్టంబు।
లేకయుండియుఁగూడ - లోకరీతి।
దనువునుమాత్రమే - ధవునకునర్పించి।
జారునిమదిలోనఁ - గోరునట్లు।
మానవుండునునీతి - మంతులుమెచ్చంగ।
సకలసత్కర్మముల్ - సలుపుచుండి।
నీకునర్పణముగ - నిశ్చలమతితోడ।
నేడవశిఖరంబు - నెక్కినీఁడు।
గీ॥ పరమపావనకరపాద - పద్మములను
సేవఁజేసెడివాఁడెపో - శ్రేష్ఠుఁడవని॥పరమ॥ 43

సీ॥ ఆచోటనేయుందు- వీచోటలేవని।
సంశయింపఁగనేల- సర్వమందు।
నీవుండు టెఱిఁగియు- నిశ్చయంబుగనేను।
భార్యయుఁబిల్లలన్- భ్రాంతినొంది।
యార్గురుశత్రువు- లత్యుగ్రులైనన్నుఁ।
బట్టియెల్లప్పుడు- బాధపెట్ట।
విషయసంసక్తుఁడై- విఱ్ఱవీగుచునుంటి।
నీమీఁదజిత్తంబు- నిలుపనైతి।
గీ॥ నాదుసరిషట్కముఁద్రుంచి-నయముమీఱ।
భార్యమతులనుసట్టినా- భ్రాంతిబాపు॥ప॥ 44

సీ॥ ఆశయనేపాశ- మతిచిత్రమైయుండు।
నిట్టిపాశంబుచేఁ- గట్టువడిన।
ఘూసవుండెప్పుడు- మహినెల్లఁదిరుగును।
ముక్తుఁడెప్పుడుగూడ- ముదముతోడ।
నున్నచోటనెయుండి- మన్ననఁబొందును।
బరిపూర్ణసుఖమును- బడయుచుండు।
నీపాశమునకంత్య- మీక్షింపఁగాలేదు।
తెగకుండనెప్పుడు- దిగ్లుచుండు।
గీ॥ దిట్టిపాశముఁద్రుంపగా- నెట్టికత్తి।
జ్ఞానపల్లయ్యునొయ్యుఁగను-బుడమిలోన॥పు॥ 45

సీ॥ అన్యకాంతలమీఁద - నాశచేయుటకంటె,
పాఱెడునేటిలోఁ - బడుట మేలు।
మూఁడమోపులతోఁడ - ముచ్చటాడుటకంటె।
బండఁగట్టుకనూతిఁ - బడుట మేలు।
జారకాంతలతోఁడ - సరసమాడుటకంటె।
బడబాగ్నిమంటలఁ బడుట మేలు।
నీభక్తుఁడగువాని - నిందఁజేయుటకంటె।
గొంతుకునురివేసి - కొనుట మేలు।
గీ॥ అనెడు పెద్దలవాక్యంబు - లరయుచుండి।
పాపమున నన్నుఁగా - పాడదయను॥పర॥ 46

సీ॥ నీనామమంత్రంబు - నిర్మలభక్తితో।
మనసులోజపియించు - మానవుండు।
వెనుకటియఘములు - వీడకవెన్నంటు।
సనిమానసంబున - వెరువకుండుఁ।
గిరిమీఁదనుండెడు - నరవరుఁడెప్పుడైన।
శ్వానసంతతులకు - భయముపడునె।
దండధరుంబట్టి - దండింపఁగలయట్టి।
నిఖిలపావనమయి - నెగడునట్టి।
గీ॥ నీమహానామమంత్రంబు - నిరుపమంబు।
మధురవకనిశంబుజపియించు - మతినినిమ్ము॥ ప॥ 47

సీ॥ సంగయుయముఃయు- మంగళకరమగు।
శారదయమునుగూడు- స్థానముసందు।
స్నానంబునొనరించి- ధ్యానంబుధరియించి।
నిర్మలంబగుపట్టి- సీతిదెలిసి।
ఆధారమేమొద- లారుచక్రంబుల।
దాటిశృంగింబుల- సుస్థిరైన।
శిఖరంబుపై నెక్కి- శ్రేష్ఠుడవగునీదు।
పదములవర్ణించి- ముదముతోడ।
గీ॥ బాజసలిపెడుపురుషునే- పుడమిలోనఁ।
ముణ్యశాలిగనెంచినేఁ- బొగడుచుందు॥ప॥48

సీ॥ ప్రహ్లాదనారద- పార్థవిశ్వామిత్ర॥
పులహపారాశర్య- పుండరీక।
వాల్మీకమాండవ్య- వామదేవమతంగ।
వ్యాసాత్రికశ్యప- వాలఖిల్య॥
కపిలాంబరీషరు- క్మాంగదాత్రివసిష్ఠ।
గౌతమఖట్వాంగ-కణ్వభీష్మ।
జాబాలిశౌనక-జమదగ్నిముచికుంద।
శుకవిభీషణదాల్భ్య-సూతులాది॥
గీ॥ పూజ్యభాగవతులగూడఁ-బొగడనేర॥
కనఁగనేనెంతవాఁడవా-కొనఁగసిన్ను॥ప॥49

సీ॥ ఎవ్వఁడుస్వప్రజ్ఞ - నెఱిఁగియుండునోవాఁడ॥
చదువేలముక్తివాని - జన్మమేల॥
తానెవ్వఁడోయని - తలఁచిచూడఁదగ॥
తానుదానేయను - తత్త్వమొప్పు॥
పంచభూతంబులు - బాగుగాఁగుదిరిన॥
తనువస్థిరమనిత - త్త్వంబుదెల్పు॥
తెలిసినంతనెవేగఁ - దెలివితోడనుమెలఁగి॥
భార్యాత్మజాతాది - బంధకంబు॥
గీ॥ త్రెంచిననీపుండుపోటుగాను - దలఁచినిన్ను॥
బూజసలిపెడివాఁడెపో - బుణ్యాత్ముఁడు॥ ప॥ 50

సీ॥ అంతరిక్షముమాయ - అఖిలదిక్కులుమాయ॥
రవిశశిజ్యోతులు - రాత్రిమాయ॥
వసుధాస్థలముమాయ - స్వర్గలోకముమాయ॥
పెండ్లాముబిడ్డలు - పెద్దమాయ॥
ఆదిశేషుఁడుమాయ - అగ్నిదేవుఁడుమాయ॥
మాయలోనుండెడి - మర్మమెఱిఁగి॥
నేనునేననుచట్టి - నీతినిదలఁపోసి॥
సాక్షిభూతుండను - సత్యమెఱిఁగి॥
గీ॥ నీవుపవిళయించునెలవును - నెఱినెఱింగి॥
సేవఁజేసెడివాఁడెపో - శ్రేష్ఠుఁడరయ॥ పర॥ 51

సీ॥ వేయిశీర్షములచే - వెలయువానికినీవు।
హారిరూపమేరాముఁ - డనుచుఁదెలిపి।
అట్టహాసంబుచే। సురులు బెదరంగ।
గగనమార్గంబున - కెగయునపుడు।
పదినూర్లశిరములు - పగిలునట్లుగవాని।
బలియుఁడై తన్నిన - బలముతోడ।
ననవరతంబును - ననుపీడ కెంతయు।
వేధించు లేమిని - వేగసేవు।
గీ॥ తన్ని భరమింపలేకుండఁ - దఱిమినాకు।
శశవసనంబులో గుమో - యమరవినుత॥ప॥52

సీ॥ అనిశంబువిడునక - నినువేఁడుచున్నాఁడ।
గూఢనుగుణ్ణయుఁ - గూర్మినిమ్ము।
నీరతంబునీకొల్వు - నేఁజేసితినిగాన।
జీతంబునకుముక్తిఁ - బ్రీతినిమ్ము।
వేసనంబుగ్రాసంబు - వసుధలోనాకియ్య।
లెకట-నీచేతిలో - లేకయున్న।
జేరిరాముని యొద్ద - జీతమ్మునకునుంచు।
మదియుఁగాకుండిన - వదలియున్న।
గీ॥ కొనకునీకుండలమ్ములైనఁ - గుదువబెట్టి।
తొనువగట్టఁగనిప్పింపఁగడఁగుమయ్య॥ప॥53

సీ॥ నక్కలునిత్తెంబు-బొక్కలు వెదకును।
ఊక్కలుచెప్పులు-కూర్మి వెదకు।
పందయెల్లప్పుడు-పంకంబు వెదకును।
ఫరనుదుర్జనుఁడెప్డు-దప్పు వెదకును।
గయ్యాళిభామిని-కలహంబు వెదకు।
తేటియెప్పుడుపూవు-దేనె వెదకు।
నీదాసుఁడగువాఁడు।నీసేవ వెదకు।
సేవనీపదములఁ-జేర వెదకు।
గీ॥ నేనునీదాసదాసుఁడ-నిజముగాను।
మదిని నన్ను నిశంబును-మరువకుండు॥పర॥56

సీ॥ కడలఁబుట్టుఁడగువానిఁ-గానడు గుటరోత।
పెద్దలఁదెగడుట-పెద్దరోత।
దయలేని వానికి-ధర్మమన్న రోత।
దంకిలాడికిఁబతి-రతము రోత।
కామినులెడవావి-కాముకునకు రోత।
నీచునకన్నరో-నిజము రోత।
విరజాజపూదండ-విధవకు బలురోత।
పాపికినెన్న నీ-భక్తిరోత।
గీ॥ రోతఁజెప్పంగ నేలను-రూఢిమెఱయ।
నిన్ను నేబొగడుచుందు దు-నిల్వకెపుడు॥ప॥57

సీ॥ సేద్యగానికమంచి- క్షేత్రంబుపైఁజింత।
నెఱయూతగానికి- నీళ్లచింత।
జారిణికెప్పుడు- జారునిపైఁజింత।
గొడ్డురాలికమది- బిడ్డచింత।
ఆకొన్నవానికి- నన్నంబుపైఁజింత।
సోమరికెప్పుడు- సుఖముచింత।
నీదాసవరునకు- నిన్నుజేరెడుచింత।
చింతలేకుండుని- శ్చింతచింత।
గీ॥ చింతజెప్పంగనేలనో- శాంతచిత్త।
కరుణతోనన్నువీక్షింపఁ-గరఁగుఁజింత॥ప॥58

సీ॥ అలపుట్టినింటిపై- నాఁడుబిడ్డకునాశ।
కడుఁలోభికెప్పుడు- కాసులాశ।
దుష్టతస్కరునకు- దొంగలింపఁగనాశ।
రోగికినిరతంబు- రుచులయాస।
కాముకునకుఁజాల- భామలపైనాశ।
కులటకుమిండనిఁ- గూడనాశ।
నీభక్తవితతికి- నిన్బొగడఁగనాశ।
ఆశలఁగెల్పునా-యాశయాశ।
గీ॥ ఆశనేమనిచెప్పుదు- నమలచరిత।
ఆశలన్నియుఁ బెగఁద్రుంచు-నాశయిమ్మ॥ప॥59

సీ॥ అనిలనందనమిథ్య- యందుజన్మంబెత్తి।
టక్కరితనములోఁ- జక్కఁబెరిగి।
వోరఁజూపులఁజూచు- నొయ్యారివేశ్యను।
గాంచిసంతసముచేఁ- గౌగలించి।
జారిణీస్వాంతంబుఁ- జక్కఁగాఁగొనియాడి।
జూదరియిల్లును- జొచ్చినిలిచి।
యంతమ్ముతేఁట్టి- యపచారములుసేసి।
యున్నవాఁడనుగాన- నిన్నుఁదలఁచి।
గీ॥ దిక్కుదిక్కులఁజూచుచు- దిగులుచెంది।
యున్నవాఁడనునోదార్చి- యుద్ధరింపు॥ప॥62

సీ॥ రంకుమాటలుసెప్ప- మంకుమానవుఁజూచి।
భళిభళియనియుబ్బి- పలుకుచుంద్రు।
జారిణీకాంతలఁ- జక్కఁగాఁగొనియాడి।
మెచ్చిధనంబుల- నిచ్చుచుంద్రు।
నీభక్తవర్యుల- నిత్యంబుదలపోసి।
మొద్దుమానవుఁడని- మొరుగుచుంద్రు।
సాధువులజూచి- వాదులుసలుపుచుఁ।
దిట్లచేతనువెళ్లఁ- గొట్టుచుంద్రు।
గీ॥ ఇట్టిపామరజనులను- మట్టుపెట్టి।
మమతతోనన్ననిశంబు- మరవకుండు॥ప॥ 63

సీ॥ నగశత్రుధరశత్రు- మగధనాథునిశత్రు।
బకుఁడనువసురుని- పరమవైరి।
యన్నదాధ్యానించు- నన్యయుండగునట్టి।
మానమహామనోన్న- మరునితండ్రి।
ధ్యానమబంధిని- బట్టిశిరంబున।
ధరియించినారని- ధర్మపత్ని।
యనిశంబుజపియించు- నామంత్రనిలయుని।
ముఖ్యభూతుడవయ్యు- ముదముతోడ।
గీ॥ నన్నుబోషింపభారమై- యున్నెనీకుఁ।
తలపకుంమునాయందుఁ-దప్పులున్న॥ప॥ 64

సీ॥ జయరఘువరయని- జలధినిలంఘించి।
చొచ్చిలంకనునీవు- చోద్యముగను।
ఇల్లిల్లుశోధించి- యిలపుత్రిఁగానక।
రుద్రరూపముదాల్చి- రోషమంది।
శింశుపావృక్షంబు- చెంతసీతనుగాంచి।
మదిలోనసంతోష- మగ్నుఁడవయి।
ధరణీతనూజకు- ధవునిసుక్షేమంబు।
దెలిపియుంగరమిచ్చి- దేవిముదకి।
గీ॥ సంతసంబునుగూర్చిఁ- శాంతమూర్తి।
నిన్నుఁబొగడంగ,జాలను-నిర్మలాంగ॥ప॥ 65

సీ॥ మూషకవాహ్యకుఁడౌ- ముఖముఁ గలవాని।
బామినీమశిమామ- పన్నగోడ।
బుట్టించువానిని- బుట్టితా బలిమిచే।
భోగించినట్టిరమా- ప్రాణపతి పేరఁ।
బరగెడునాతని- బలిమఁడై గెకొన్న।
వాయునందనుఁగని- వాని కొడుకు।
పేరిమి కారంబు- జాటించి మారుతజుఁ।
కారంబడఁగ చేరు- గాంచువాని।
గీ॥ తండ్రి చెల్లెలి భర్తగ- ధముఁగనేత।
నంబుగా నిలచిన నీవు- నన్ను నేలు॥పరమ॥ 66

సీ॥ ఇలనిన్ను బొగడనో- రిచ్చితి వేకాని।
ప్రభులతోఁ జాడీలు- పలుకగాదు।
ఇలనిన్నుఁగనఁగన్ను- లిచ్చితి వేకాని।
కులటలఁ జూపుగ- న్గొనఁగఁగాదు।
ఇలఁజేయి నీపూజ- కిచ్చితి వేకాని।
పంభ్రమిభుచములఁ- బట్టగాదు।
ఇలనెన్న నినుమది- నిచ్చితి వేకాని।
కులుకుమిటారులఁ దలపఁగాదు।
గీ॥ అనఘ పెద్దల నీతుల- నరయనుంచు।
నీతిరహితుఁడననుఁగాపు- ప్రీతితోడ॥పర॥ 67

సీ॥ కరుణఁబ్రోవుమనినీదు- మరుగుఁజేరితిఁగాని।
కాసువీసము మీఁది- కాంక్షఁగాదు।
పాలింపుమనినేను- బలికితినెకాని।
భవసంసారలమే- ప్వానకఁగాను।
దయజూపమనినీదు- దరిఁజేరితినిగాని।
పిత్రమిమ్మనినన్న- వేఁడగాదు।
మోక్షమిమ్మనినీకు-మ్రొక్కితినేకాని।
కూటికిగుడ్డల- కోరుఁగాదు।
గీ॥ దీనుఁడగునన్ను మదినెంచి. దేవనాథ।
భక్తిమార్గంబుఁజూపుము.ప్లవగవర్య॥ప॥ 68

సీ॥ ధర్మమార్గముజూడ-దప్పకయుండుటే।
మహిలోనినరులకు-మంచిబుద్ధి।
పెద్దలఁగనుఁగొన్న-భృత్యులకైవడి।
సేవనుజేయుటే-శ్రేష్ఠబుద్ధి।
నిఖిలప్రపంచంబు-నీమాయగానమ్మ।
భ్రాంతినివిడుచుటే భవ్యబుద్ధి।
ఆలుబిడ్డలమీఁద-నాశలేకుండుటే।
ధరణిమానవునకుఁ.దగినబుద్ధి।
గీ॥ ఇట్టిసద్బుద్ధులెల్లను.నెఱిఁగినిన్ను।
మదినిబొగడినవాఁడెపో.మాన్యుఁడరయ ప 69

సీ॥ కాశియాత్రలుచేసి- గాసిచెందగవచ్చు।
గంగాదినదులము- నుంగవచ్చు।
యమునితోఁబోరాడి- యతనిపాశంబును।
వెరపులేకనుద్రెంచి- వేయవచ్చు।
పులికోఁజలనుఁబట్టి- వెలికినీడ్వగవచ్చుఁ।
ఖగపతివలెనెగిరి- కెగరవచ్చు।
దిక్పాలకులనొక్క- దిక్కుకుఁదేవచ్చు।
బక్షివాహనునైనఁ- బట్టవచ్చు।
గీ॥ మనసునిల్పుటకష్టంబు- మాన్యవినుము।
కరుణనామదిఁగట్టుము- కపివరేణ్య॥పర॥ 70

సీ॥ అన్యకాంతలబట్టి- యాటలాడుచునట్టి।
మూఢమానవునకు- మూడుఁజేటు।
లంచంబుఁగొనిసాక్షి- వంచనతోఁజెప్ప॥
దుష్టమానవునకుఁ- దోడరుఁజేటు।
పరులవిత్తంబుల- హరియించుచుండెను।
కడుమోసగానికిఁ- గలుగుఁజేటు।
నీభక్తుఁడగువాని- నిందించుచుండెను।
నధమాధమునికెప్పు- డగునుజేటు।
గీ॥ చేటుచెప్పంగనేలనా- నోటితోడఁ।
జేటుసేసట్టిపనినన్నుఁ-జేయనిమ్ము॥పరమ॥ 71

సీ॥ జగతిలో నుండెడు - జనుల జాడలు గొన్ని ॥
చెప్పెద వినవయ్య - చిత్తగించి ॥
పరకాంతలన్నను - బలుమోక్ష మిచ్చెద ।
రిలనీదు దాసుల - కిడుము కాదు ॥
తులుకుల మాలమాటఁ - గార్యంబుతో వినిరెద ॥
దీల భక్తు లేడ్చిన - నిడురు చెప్పుల ।
సంతోత్తులఁ జూచి - రంజిల్లుచుందురు ।
నీ భక్తులను జూడ - నిల్వలేరు ॥
గీ॥ ఇట్టి మనుజాధముల నెల్ల - ముట్టి పెట్టి ।
కరుణతో నన్ను వీక్షింపు - తరుచ చేంద్ర ॥ హ॥ 72

సీ॥ అన్యకాంతల పొందు - నాశించు వానికిఁ ।
బుట్టు రోగంబె యీ - భువిని సాక్షి ।
నీతివంతులఁ జూచి - నిందించు వానికి ।
నుదరరోగంబె యీ - యుర్వి సాక్షి ।
మాతను దూషించు - జాతిహీనునకును ।
దగు గండమాలయె - దెగులు సాక్షి ।
తండ్రితో వైరంబు - దరఁ జేయు వానికిఁ ।
బెద్దరోగ మొకటి - బెద్ద సాక్షి ।
గీ॥ సాక్షులను జెప్పనేలనో - శక్రవినుత ।
యిట్టి వెవ్వియు నన్నంట - నియ్యకయ్య ॥ హ॥ 73

సీ॥ మనసునిల్పఁగలేని- మనుజుండు నిరతంబు।
దేశదేశములెల్లఁ- దిరుగనేమి।
ఆశలుద్రుంచక- యావనిఁగోసరదుండు।
కాషాయవస్త్రముల్- గట్టనేమి।
మోహంబుగోయక- ముదముతోడనుదాను
జడలుధరించిన- జగతినేమి॥
మదమునుగొట్టక- మంతుజీవితముతోఁ।
బులితోలుధరియించఁ- బుణ్యమేమి।
గీ॥ ఫలములేదయ్య నీపాద- భజనలేక।
గాననీపాదసేవయో- కరుణనొసఁగు॥పర॥ 74

సీ॥ ధనముపైనాశచే- తనువేశ్యకామిని।
విటులయాస్తులదోచి- విఱ్ఱవీఁగుఁ।
గానుపైనాశచే- గడమీఁదనిలఁబడి॥
యాడిసవ్వచునుంపు- సవనిలంజె।
బంగారుపైనాశఁ- బాయకజారిణి॥
జారులఁబొందంగఁ- గోరుచుండు॥
నిట్టిదుర్వనితలఁ- బట్టినవానికి।
గాలపాశముగట్టఁ- గాచియుండు॥
గీ॥ ననెడుపెద్దలవాక్యంబు- లనుదలంచి।
భక్తినిన్నుభజించును- భక్తవరుఁడు॥ప॥ 75

సీ॥ చిత్తంబులోశుద్ధి- చెలఁగకమనుజుండు।
నీధ్యానమొనరింప- నిష్ఫలంబు।
శ్రేష్ఠుఁడౌగురునాథు- సేవయొనర్పక।
నీతులువచియింప- నిష్ఫలంబు।
తన్నుఁదానునెఱింగి- ధన్యుఁడుగాకమై।
నిండబూడిదెపూయ- నిష్ఫలంబు।
మాయనుద్వజియించు- మార్గంబుగానక।
నెఱివల్కలముగట్ట- నిష్ఫలంబు।
గీ॥ నిన్నుఁబొందనిజన్మంబు- నిష్ఫలంబు।
నిన్నుఁబొగడనివాక్కులు- నిష్ఫలములు॥ప॥76

సీ॥ దాహంబుచెఱువులోఁ- దాదీర్చుకొనకుండ।
నబ్ధినీగనివేడ- నగునెఫలము ।
దాతసువిడనాడి- ధనలోభియగువాని।
యాచనచేసిన- నగునెఫలము।
మధురఫలమ్ముల- మానినింబఫలంబు।
కామింపఁజిల్కదాఁ గనునెఫలము।
నీదాసవర్యుని- నిత్యంబుగొలువక।
యధమునిఁగొలిచిన- నగునెఫలము।
గీ॥ ఫలములేదయ్యవేయేసి-పలుకులేల।
నీవెనాపాలిఫలమిచ్చు-దైవమయ్య॥పర॥ 77

సీ॥ నీకథవినుచుండ-నిద్రవచ్చుచునుండు॥
నెలఁతులకథవిన-నిద్రపోరు।
ధర్మంబుఁబనిసేయ-ధరనువిఘ్నమువచ్చు।
గడుఁబాపములకు-విఘ్నములుపోరు।
బెద్దలకొలువన్నఁ-బెనుమంటగప్పును।
వెలయాలనఁగమంట-వెఱచిపోరు।
దానంబునకునన్న-ధనలోభమరుదెంచు।
భామినికన్నలో-భంబుపోరు।
గీ॥ నిట్టివింతలవర్ణింప-నెవ్వఁడోపు।
నీవెదరెజేస్రవలయును-నిష్కళంక॥పరమ॥78

సీ॥ సత్యవంతునిమాటసభలమోఘ్యంబయ్యె।
మతిహీనుమాట-సన్నుతికినెక్కెఁ
బుణ్యాత్ములగువారె-భువిలోనలేరైరి॥
పాపాత్ములేయిలఁ-బ్రబలులైరి।
కులకాంతలనువారు-కొద్దిగానుండిరి।
జారకాంతలసంఖ్య-జగతిహెచ్చె।
నిర్జరాలయములు-జర్జరితములయ్యె।
భామాలయావళి-భద్రమయ్యె।
గీ॥ అయినఁగానిమ్మునాకేమి-యార్యవినుత॥
నీవెననుఁబెంచుతండ్రివి-నిజముగాను॥ప॥79

సీ॥ నీతియుఁ దెల్పియు. నిత్యమంగళమిచ్చి।
మమతతో నన్నేలు. మాన్యుఁడీవు।
పాపసమూహంబు. పరువులెత్తఁగఁదోలి।
పుడమిలో ననుఁగాచు. పుణ్యుఁడీవు।
ధర్మమార్గముఁజూపి. దప్పకుండుమటంచు।
నయయంబుబోధించు. నప్పవీవు।
వైరులఁగ్గునిఁబట్టి. వధియింపుమనినాకు।
వేవిధంబులఁదెల్పు. వీరుఁడీవు।
గీ॥ నిన్నువర్ణింపఁగానాకు. నేర్పుగలదె।
కరుణనాయెడనుంచుము. కామరూప ప। 84

సీ॥ ఈజన్మమింకఁబోన. నేజన్మమబ్బునో।
పాముతేలోగాక. పామునోటి।
కప్పయోయెలుకయో. కప్పనోటికిబడు।
జంతువో లేకున్న. జగతియందు।
నల్లియోబల్లియో. నత్తయోపీతయో।
యేతనువమరునో. యెరుగరాదు।
గావునవిప్పుడే. కరుణించుమునినీదు।
పదములభజియింతు. ముదముతోడ।
గీ॥ నీరజాప్తునిశిష్యుఁడై. నెగడినావు।
నమ్మిననుఁగామపట్టిదై. వమ్మునీవు ॥ప॥ 85

సీ॥ ప్రారబ్ధకర్మంబు-పట్టి బాధింపంగఁ
గనుఁగడగండ్లచే-గాసిపడుచు
నరజన్మమును నెత్తి-ధరణిలోపల నేను
గనుపుకూటికి నయి-కష్టపడుచు
భార్యయున్ సుతులును-బంధంబులోఁజిక్కి
విత్తంపుటాశచే-వేధపడుచు
నీమాయ దెలియక-నిత్యంబు మదిలోన
బలుకసాధ్యముకాని-పాటుపడుచు
గీ॥ ఆయువును వ్యర్థపఱచితి-నంచు విడక
తెలివిమాని ననుఁగావఁ-దలంపుమయ్య ।ప॥86

సీ॥ నీమీఁదఁ జిత్తంబు-నిలిపెద నన బుద్ధి
జారిణీధ్యానముల-జాడఁబోరు
నిన్నుఁ బూజింపంగ-నెన్న నా హస్తముల్
పరభామకుచములఁ-బట్టఁబోరు
నిన్నుఁ జూడఁగ నెంచి-యున్న నా పాదముల్
చెచ్చెర వేశ్యలఁ-జేరఁబోరు
సొబగగు నీమూర్తి-చూడంగ నెంచిన
కన్నులు కులటలఁ గాంచఁబోరు
గీ॥ నిన్ను నే నెట్లు సేవింతు-నిర్గుణాత్మ
యుద్ధరింపుము దీనుడఁ-నుద్ధరింపు ।పరమ। 87

సీ॥ నిన్ను నమ్మితి నయ్య - నన్ను బ్రోవుము నీవు।
నీకు మించిన దిక్కు - నాకు లేదు।
దిక్కు లేకుండెను - దీను రక్షింప।
నికుఁబుత్ర్యము వచ్చ్చి - విజయు గాను।
శాపాలి దైవంబు - నో పాపభంజన।
నిన్ను నేమరువను - విరక్తులాత్మ।
పతితపావనుఁడవు - భక్తవత్సలుఁడవు।
నన్ను రక్షింపుము - నగచరేంద్ర॥
గీ॥ నేను దాసానుదాసుఁడ - నీకు దేవ।
గాచనను వీడన్యాయంబు - గాదు కాదు ।ప।౪౪
సీ॥ దేహమస్థిరమని - తెలియంగఁ జాలని।
మహిలోన బలువుండ మతిని నేను।
పాపకార్యంబులఁ - బట్టి సాధించెను।
జగతిలో బలుకూర - జనుఁడ నేను।
ధర్మమార్గము జాడ - దప్పి వర్తించెను।
భువిలోన యధమాధముఁడను నేను।
నీదాసులగువారి నిత్యంబు నిందించు।
ఘోరచిత్తుండగు - కూళ నేను।
గీ॥ ఇట్టి నను నీవు కృపనుద్ధ - రించితేనిఁ।
బతితపావన నీకీర్తి ప్రకటమగును। పరమ ౪౫

సీ॥ పనసతొళలకన్న - బంచదారలకన్న।
కువలయంబునదీపు - కులటపల్కు।
కుసుమాయుధుఁడు పట్టు - కోదండమునకన్న।
గమదీపుజారిణీ - కాంతపల్కు।
తుండశర్కరకన్న - గదళీఫలముకన్న।
నధికమాతీపురో - యతివపల్కు।
కానియీపల్కులకన్న దీపుగనుండు।
నీదాసవరునకు - నీదుపల్కు।
గీ॥ నీపలుకుతీపువర్ణింప - నోపునెవఁడు।
భక్తినీనామమంత్రమే - పలుకుచుండు। ॥ప। 92
సీ॥ శాంతియఁగత్తిహస్తంబునఁదాల్పంగ।
ధరనుదుర్జనుండేమి - తన్ను జేయుఁ
జిత్తంబులో భ్రాంతి - చెందకయుండిన।
వలపింపఁదన్నేమి - వనితచేయు।
గరుడుండుడనచెంత - గాచియుండెడివేళ।
దందశూకములేమి - దన్ను జేయు।
నీనామమంత్రంబు - నిరతంబుజపియించ।
దన్నేమిశమనుండు - ధరనుజేయు।
గీ॥ ననుచునీనామమంత్రంబునసవరతము।
నెంచుభక్తినినోటజపించుచుండు। ।ప। 93

సీ॥ కేసరిపుత్రనా - కేల్దమ్మిమోడిచి।
యనుదినంబుననిన్ను - నవనిగొలుతు।
శ్రీరామదూతనీ - శ్రేష్ఠతమంబగు।
నాజ్ఞలఁదలదాల్చి - యలరుచుందు।
నిత్యమంగళరూప - నీనామమంత్రంబు।
మరవకుండగ నేను - మదిదలంతు।
భావనాకారనీ - పరమభక్తులసేవ।
మహిలోననిరతంబు - మానకుందు।
గీ॥ ధీనుడ - గునన్ను దయజూచు మదికెక్కనీవె।
ముక్తిమార్గంబుజూపుము - ముదముతోడ।ప॥94
సీ॥ నీచులతోఁపొందు - నిలనుచేయఁగరాదు।
పరులదుర్గుణమెత్తి - పలుకరాదు।
బీదవానికినాశ - పెట్టిత్రిప్పగరాదు।
జీతమీయనికొల్వు - చేయరాదు।
కవులతోవైరంబు - భువినిచేయఁగరాదు।
తనకన్న బలవంతుఁ - జెనకరాదు।
హరిభక్తులనుజూచి - హాస్యమాడగరాదు।
మదిలోననీసేవ - మరువరాదు।
గీ॥ ఇట్టిలౌకికకృత్యమ్ము - లెల్లఁజెలిసి।
నిన్నుభజియించువాఁడెపో - నీతిపరుడు ।ప। 95

సీ॥ తొమ్మిదిబెజ్జాల. తోలుతిత్తిని నమ్మి।
భార్యయు సుతులను. భ్రాంతినొంది।
యూర్జునైరుల. సతిముదమ్ము నమ్మి।
విశ్వంపుటాసచే. వేషనొంది।
మాయాప్రపంచంబు, మనసు నొప్పల నమ్మి।
కామ్యముల్ పడయు గాంక్ష. గట్టిగొంచి।
యింద్రభోగములఁ జూచి. యివినిజంబని నమ్మి।
కేశవు కోటికినయి. గాసినొంది।
గీ॥ తుదను నీకొల్వు చేరిన - సుజ్ఞచిత్తు।
నన్ను మన్నింపు నయఘోన. నాథనాథ ॥ప॥ 98
సీ॥ కాశియాత్రను జేసి. కడతేరుదామన్న।
దేహకష్టమునకు. దేవ యోర్వ।
దీర్ఘయాత్రలచేఁ గ్ర - తార్థుడయ్యెదనన్నఁ।
జన్నీళ్ళమునుగంగఁ జలికినోర్వ।
నర్థదానముజేసి - యనఘుడయ్యెదనన్న।
గనులోభగుణమును - విడువజాల।
మహిదానమొనరించి - మాన్యుడయ్యెదనన్న
మదిలోనికోర్కెల - మానజాల।
గీ॥ భక్తితో నిన్ను భజియింతు - భవ్యచరిత।
ముదముతో నన్ను మన్నించి - మోక్షమొసగు ॥ప॥ 99

సీ॥ బ్రహ్మచర్యంబునం-బ్రఖ్యాతివడసిన।
వారిలో బ్రఖ్యాతివడసినావు।
స్వామిభక్తులలోనఁ-బ్రఖ్యాతివడసిన।
వారిలో బ్రఖ్యాతివడసినావు।
బలజవమ్ములయందుఁ-బ్రఖ్యాతివడసిన।
వారిలోఁ బ్రఖ్యాతివడసినావు।
వరములిచ్చుటయందుఁ-బ్రఖ్యాతివడసిన।
వారిలో బ్రఖ్యాతివడసినావు।
గీ॥ పూతచారిత్రనిన్నెన్న-నాతరంబె।
ముదముతో నన్ను మన్నించి-మోక్షమిమ్ము॥ 100

సీ॥ నరసాంబకిని సుం-డప్పకు సుబ్బణ్ణ।
కొడుకయ్యెనతఁడును-గుండమాంబ।
యనెడుతత్పత్నియు-యాత్రలన్ని యుసల్పి।
ప్రఖ్యాతులై రిదం-పతులువీరు।
వీరిజ్యేష్ఠసుతుండు-వేంకటకృష్ణప్ప।
యతనితమ్ముఁడనార-ణప్పనేను।
శుక్లయజుశ్శాఖ-శుద్ధపారాశర్య।
గోత్రకాత్యాయనీ-సూత్రజుండ।
గీ॥ హాలగానపురమ్మున-నలరువాఁడ।
శతకమర్పించితినిగొమ్ము-శరణమిమ్ము।
పరమభక్తజనాశ్రయ-పవనతనయ।
హాలగానపురాలయ-ఆంజనేయ॥

శ్రీ ఆంజనేయశతకం సంపూర్ణం.

శుద్ధాశుద్ధపత్రిక

| పుట, | పద్యము, | పంక్తి, | తప్పు, | ఒప్పు. |
|---|---|---|---|---|
| 9, | 9, | 6, | నాశజే, | నాశచే |
| 11, | 22, | 1, | దిన్కు, | దిక్కు |
| 14, | 28, | 2, | మొలడలను, | మొగ్గడలను. |
| 15, | 30, | 1, | నటియూ, | నట్టియూ. |
| 21, | 42, | 3, | కౌరవ, | రౌరవ. |
| 22, | 44, | 5, | సన్ను, | నన్ను. |
| 25, | 50, | 9, | త్రెంచిస, | త్రెంచి. |
| 25; | 51, | 7, | నటి, | నట్టి. |
| 28, | 56, | 4, | వెదకును, | వెదుకు. |
| 28, | 56, | 5, | వెదుకు, | వెదుకును. |
| 28, | 56, | 7, | వెదుకు, | వెదుకును. |
| 28, | 57, | 5' | కాముకునక, | కాముకునకు. |
| 42, | 85, | 9, | శిశ్యుడై, | శిష్యుడై. |
| 47, | 94, | 1, | మోడచి, | మోడ్చియు. |

మహనీయులారా, ప్రమాదవశంబున పడియుండు తప్పులను క్షమించి నన్ను మన్నించి తెలిపిన రెండవ కూర్పునందు సవరణచేయింతును.

ఇట్లువేము,

శ్యా. నారణప్ప.

# కృతజ్ఞత

ఈశతకము ప్రారంభించినసంతరం ఆదిపూడిసోమనాథరావుగారిచేపరిష్కృతముచేయించి తమముద్రాక్షరశాలయందునే ముద్రింపించి-ప్రచురించి,యిట్టిమహోపకారంబు చేసిన బి. మునిస్వామినాయుడుగారికి దేవుడు చిరాయురారోగ్య ఐశ్వర్యంబులొసంగుగాక.

యీశతకము పూర్తియించిన సంతరము అచ్చువేసుకొనుమని సన్ను ప్రోత్సాహించిన మ॥ రా॥ హోలగానహళ్లి యర్రసోమురెడ్డిగారు పుత్రం హనుమంతప్పగారు పటేల్ ఇరల్లె గౌనివారు, లక్ష్మిరెడ్డిగారు, టైలర్ నాగోజిరావు ఆంగడితుక్కారామ్, స్కూలుమాస్టరు,యస్.పకీరప్పగారు,ఆకులునరసింహప్పగారు(నాగసముద్రం చిన్నప్పరెడ్డిగారు,వీరికొమార్లు వెంకటరెడ్డిగారు,ద్యాణ్ణరెడ్డిగారు)మరియుసక్కరరెడ్డిగారు, పాయసం హనుమంతరెడ్డిగారు, ఇడగూరు శ్యా.శ్యామణ్ణగారు,హిందూపురం ఆకులహనుమంతప్పగారు, వీరికికృతజ్ఞుడను

ఇట్లువిన్నవించు

శ్యా॥ నారణప్ప.

